మేషం
వృషభం
మిథునం
కటకం
సింహం

మీనం

# శ్రీ విశ్వావసునామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గము

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణము

## 1965-66

[ వెల 50 పైసలు.

కన్య

కుంభం
మకరం
ధనుస్సు
వృశ్చికం
తుల

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానం, తిరుమల.

## ఆర్జితము షెడ్యూలు (1-7-58 నుండి)

కర్పూరహారతి (ఒక్కొక్కటికి) .... .... రు. 1

### (i) దర్శనములు :—

| | | |
|---|---|---|
| 1. తోమాలసేవ | రు. | 13 |
| 2. అర్చన (సహస్రనామం లేక అష్టోత్తరం) | | 7 |
| 3. ఏకాంతసేవ | రు. | 13 |
| 4. పూలంగి దర్శనము | .... | 1 |
| 5. అభిషేక దర్శనము | .... | 1 |

గమనిక :— 1, 3, సేవలకు ఒక్కొక్క టిక్కెట్టుకు తమకు చేరినవారైన మొత్తం 5 మంది మాత్రం పోవచ్చును. 2-వ సేవకు 4 మంది మాత్రమే. 4, 5 సేవలకు ఒక్కొక్కరు మాత్రమే పోనగును.

### (ii) సేవలు:—

| | | |
|---|---|---|
| 1. అమంత్రణోత్సవము | రు. | 100 |
| 2. పూలంగి సేవ | .... | 60 |
| 3. అభిషేకము (పులికాపు సేవ) | | 450 |
| 4. గంబుర గిన్నె | రు. | 250 |
| 5. పునుగు గిన్నె | .... | 85 |
| 6. కస్తూరి గిన్నె | .... | 50 |
| 7. జాప్రాగిన్నె | .... | 65 |

గమనిక :— 1-వ సేవకు ఆనాడు ఉదయము తోమాల సేవ అర్చనలకును, రాత్రి ఏకాంత సేవకును తాము తమకు చేరినవార్లుగా మొత్తం 10 మంది పోవచ్చును. ఈ సేవ జరుపువారికి ఉదయము నైవేద్యము కాగానే పొంగలియు నొసంగుదురు. దత్తమునకు 1 రు. అధికముగా నివ్వవలయును.

2-వ సేవ. ఈ సేవ జరుపునపుడు దర్శనార్థము తాము తమకు చేరినవారైన మొత్తం 10 మంది పోవచ్చును.

3 నుండి 7 వరకు గల సేవలకు అభిషేకమునకు 3-వ అయిటానికి తాము తమకు చేరినవారైన మొత్తం 20 మందియు, 4 నుండి 7 వరకు తాము తమకు చేరినవారైన మొత్తం 10 మంది పోవచ్చును. ఈ 3-వ అభిషేకమునకు కట్టినవారిచేతికి అభిషేకపు సామానుల నిచ్చి ఊరేగింపుతో బంగారువాకిలివరకును తెచ్చెదరు. 4 నుండి 7-వ నెంబరులకు ఆ యా వస్తువులున్న గిన్నెలమాత్రము వారికిచ్చి బంగారువాకిలివరకు ఊరేగింపుతో తెచ్చెదరు.

| | | |
|---|---|---|
| 8. సహస్రకలశాభిషేకము | రు. | 1500 |
| 9. తిరుప్పావడ | .... | 1600 |
| 10. కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | | 900 |

గమనిక :— 8 నుండి 11 యివన్నియు ఒక్కొక్కదిన కార్యక్రమములు. వీనిని జరిపించువారికి ప్రసాదములు, లడ్డు, వడ, అప్పము, దోసెలు వగైరాలు గాక కార్యక్రమము పూర్తికాగానే వస్త్రబహుమానముకూడ నొసంగుదురు.

సాధారణముగా అవసరమునుబట్టి దత్తమునకును, హారతికిని ఒక్కొక్కరూపాయ అధికముగా కట్టవలసియుండును.

### (iii) ఉత్సవములు :—

| | | రు. |
|---|---|---|
| 1. వసంతోత్సవము | .... | 2000 |
| 2. కల్యాణోత్సవము | .... | 500 |
| 3. బ్రహ్మోత్సవము | (1వ తరగతి) | 1500 |
| 4. ,, | (2వ తరగతి) | 750 |

గమనిక :—1. వసంతోత్సవము :— ఇది సామాన్యముగా 3 రోజులు జరుపబడును. చేయించువారి సౌకర్యమునుబట్టి దేవాలయముయొక్క సౌకర్యములనుబట్టియు, యింకను తక్కువ దినములలోను జరుపబడును. చేయించువారికివస్త్రబహుమానము యొసగబడును.

శ్రీలక్ష్మీవేంకటేశాయ నమః

# శ్రీవిశ్వావసునామ సంవత్సర

# సిద్ధాన్త పంచాఙ్గము

## 1965-66

తిరుమల తిరుపతి దేవస్థానముల సిద్ధాన్తి వగైరా మిరాశిదార్,
శ్రీమాన్ పరవస్తు సిద్ధాన్తి శ్రీనివాసవరదాచార్యులు వారిచే
గణింపబడి




తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన పండితులు
వైయాకరణపంచానన
ఆకులమన్నాడు శ్రీమాన్ పండిత ఆర్. పార్థసారథి అయ్యంగార్లవారిచే సరిచూడబడి

తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు
శ్రీ బి. నరశింగరావు, బి. ఏ., బి. యల్., గారిచే ప్రకటింపఃబడినది.

తిరుపతి.

1965



తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి

శ్రీ ర స్తు

శ్రీలక్ష్మీ వేంకటేశః ప్రసన్నో భవతు

శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# శ్రీ విశ్వావసు నామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గ పీఠికా.



శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ । విఘ్నం విఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

శ్రీమాన్ శ్రీశేషపృథ్వీధరశిఖరపరిస్పందిపాదారవింద-

ద్వంద్వో మందీకృతేందుప్రభరుచిరుచిరస్వాననస్సంతనోతు ।

లక్ష్మీం లక్ష్మీవియోగాసహనిజహృదయః కోపి కారుణ్యపూర్ణో

దేవాధీశః ప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో వః ॥

కందర్పకోటిసదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠముదారహారమ్ ।

పీతాంబరద్యుతివిరాజితదివ్యదేహం శ్రీవేంకటేశవపురాత్మని సన్నిధత్తామ్ ॥

ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం

తద్వక్షఃస్థలనిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్ ।

పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం

వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందనయోగదృశ్యామ్ ।

సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదా మనన్యశరణశ్శరణం ప్రపద్యే ॥

విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।

కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రకమనీయవిగ్రహమ్ ॥

ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః

భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ।

సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః

ధైర్యం రాహుశ్చ కీర్తిం సకలశుభయుతాం కేతురిష్టార్థసిద్ధిమ్ ॥

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ । వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥

శ్రీవేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ । నమస్కృత్య హృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥

సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః । దద్యుర్మనోరథం సర్వప్రకారఫలముత్తమమ్ ॥

జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్ ।

చంద్రార్కౌ తత్ర సాక్షిత్వం భజేతే నిశ్చలం యతః ..

యథా శిఖా మయూరాణాం నాగానాం మణయో యథా ।
తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్ని సంస్థితమ్ ॥

తిస్రశ్చాయాంగుళీర్యో వహతి విషువతో వేంకటాఖ్యో గిరీంద్రః
తత్సాన్తే శ్రీనగర్యాం విరచితవసతిర్నాథమాసీంద్రవీథ్యామ్ ।
శ్రీమాన్ పంచాంగమేతత్కలయతి పరవస్త్వన్వయాంభోధిరాకా-
చంద్రః శ్రీ శ్రీనివాసస్సకలజనముదేతాతనామా వరేణ్యః ॥

యేన జ్యోతిషవిదుషా రవిసిద్ధాన్తం సమగ్రమనుసృత్య ।
గణితం పంచాంగమిదం గుణితం విబుధైశ్చిరం జీయాత్ ॥

## అబ్దత్రయనిరూపణమ్.

అస్మిన్దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః । చాంద్రమానేన చైత్ర శుక్ల ప్రతిపత్ప్రభృతి శ్రీ విశ్వావసునామ సంవత్సరః । శ్రీ సౌరమానేన చైత్ర శుక్ల ద్వాదశీ ప్రభృతి శ్రీ విశ్వావసునామ సంవత్సరః । బార్హస్పత్యమానేన శ్రీ పింగళనామ సంవత్సరః । సర్వత్ర గురూదయవశాత్కార్తిక మార్గశీర్షాద్దః ॥

## అథ బ్రహ్మాద్యాయుఃప్రమాణనిర్ణయః

శ్రీమద్భగవద్దివ్యనాభీకమలజాతస్య చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుః ప్రమాణ సౌరాబ్దాః ౩ పద్మములు, మహాఖర్వం ౧, ఖర్వం ౧, న్యర్బుదాని ౧౦, అర్బుదాని ౪, బ్రహ్మణో దినప్రమాణ వర్షాణి ౪ లక్షల ముప్పైరెండువేలు. బ్రహ్మణః పరమాయుర్వర్షశతమ్ ॥ సృష్ట్యాదిగతసౌరాబ్దాః ౧౯౫౫౮౮౫౦౬౬ - కల్యాదిగతాబ్దాః ౪౦౬౬ - శాలివాహనశకగతాబ్దాః ౧౮౮౭ - విక్రమశకః ౨౦౨౧ - హిజరీ ౧౩౮౪—౧౩౮౫ - ఫసలీ ౧౩౭౪—౧౩౭౫ - హూణశకాబ్దాః 1965—1966. బ్రహ్మణః పరమాయుః పూర్వార్థం గతమ్ ॥ ఉత్తరపంచాశద్వర్షే ప్రథమమాసే ప్రథమపక్షే ప్రథమదివసే త్రయోదశ ఘటికాః షట్చత్వారింశద్విఘటికాశ్చ భుక్తాః ॥ వర్తమాన శ్రీ విశ్వావసునామ సంవత్సరస్య శ్రీశైలాది మహేంద్ర గిరిమధ్యస్థ త్రైలింగదేశస్య రాజాదినవనాయక నిర్ణయః క్రియతే ॥

మేషసంక్రాన్తిఫలమ్ ॥ చైత్ర శుక్ల ద్వాదశీ భౌమవాసరే ఉదయాది ౨౬-౫౦ లకు మేషసంక్రాన్తి । ఏతత్ఫలం ॥

దివాచేన్మేషసంక్రాన్తిరనర్ఘకలహప్రదా ।
సాయంతనే సువృష్టిశ్చ కుజవారే త్వనర్ఘదా ॥

## శ్రీ విశ్వావసునామ సంవత్సరస్య రాజాది నిర్ణయః

రాజా శుక్రః । మంత్రీ కుజః । సేనాధిపతిః కుజః । సస్యాధిపతిః శుక్రః । ధాన్యాధిపతిః బుధః । అర్ఘాధిపతిః చంద్రః । మేఘాధిపతిః చంద్రః । రసాధిపతిః రవిః । నీరసాధిపతిః శుక్రః । పశుపాలకస్థాన సంరక్షకో గోపాలః ॥ చతురాఢకపరిమితం వర్షం । త్ర్యాఢకపరిమితో వాయుః । పదిభాగములు పంటలు.

## అథ నవనాయకఫలమ్

### రాజ్ఞశ్శుక్రస్య ఫలమ్

సంపూర్ణసస్యా వసుధా సువృష్టిర్గావో హి సంపూర్ణపయోధరాశ్చ ।
స్త్రియః ప్రియాణాం జనయంతి తోషం కామోపచారైర్భృగుజేబ్దనాథే ॥

తా॥ భూమి సకల సస్యములచే సమృద్ధమై వెలయును. పశువులు వలయునంత క్షీరసంపద నిచ్చును. స్త్రీపురుషు లన్యోన్య స్నేహమోహములతో సుఖింతురు. ఇది శుక్రుడు రాజుగ నుండిన ఫలము.

### మంత్రిణః కుజస్య ఫలమ్

పురగ్రామవనాదీని దహ్యంతే వహ్నినా భృశమ్ ।
మందవృష్టిర్భవేద్యుద్ధం మంత్రీ స్యాద్భూమినందనః ॥

తా॥ దేశమంతయు అగ్నిభయముతో తల్లడించును. వర్షము కొలదిగా కురియును. యుద్ధభయము కలుగును. ఇది అంగారకుడు మంత్రియైన ఫలము.

### సేనాధిపతేర్భౌమస్య ఫలమ్

చోరాగ్నిబాధా గ్రామే చ దుఃఖితాస్సకలా జనాః ।
అత్యంతయుద్ధం భూపానాం భౌమే సేనాధిపే సతి ॥

తా॥ దేశమందు చోరులవలనను, అగ్నివలనను భయముతో ప్రజలు కష్టపడుదురు. రాజులలో యుద్ధభయము హెచ్చగును. ఇది అంగారకుడు సేనాధిపతియైన ఫలము.

### సస్యాధిపతేశ్శుక్రస్య ఫలమ్

జలధాన్యాని సర్వాణి స్థలధాన్యాని యాని చ ।
పాండుభూమిస్తు ఫలితా శుక్రే సస్యాధిపే సతి ॥

తా॥ పల్లపుపంటలు, మెరకపంటలు చక్కగా ఫలించును. ఇది శుక్రుడు సస్యాధిపతియైన ఫలము.

### ధాన్యాధిపతేర్బుధస్య ఫలమ్

మధ్యవృష్టిర్మందసస్యం మేఘా వాతేన పీడితాః ।
రోగాపీడా జనాస్సర్వే బుధే ధాన్యాధిపే సతి ॥

తా॥ మధ్యవృష్టియు, స్వల్పఫలితమును, మేఘములకు గాలివలన ప్రతిబంధమును, ప్రజలలో రోగపీడయు యేర్పడును. ఇది బుధుడు ధాన్యాధిపతియైన ఫలము.

### అర్ఘాధిపతేశ్చంద్రస్య ఫలమ్

సువృష్టిస్సర్వసస్యానామతివృద్ధిశ్చ జాయతే ।
మహతీ చార్ఘవృద్ధిస్స్యాచ్చంద్రే చార్ఘాధిపే సతి ॥

తా॥ సర్వసస్యములకు అభివృద్ధి నీయగల మంచి వర్షము, వెలలు హెచ్చుగ నగుటయు కలుగును. ఇది చంద్రు దర్ఘాధిపతియైన ఫలము.

### మేఘాధిపతేశ్చంద్రస్య ఫలమ్

నదీతటాకాదిషు భూరితోయం అతీవ ధాన్యం ప్రబలా జనాశ్చ ।
శాలీక్షు గోవారిచరాభివృద్ధిర్మేఘాధిపో యత్ర నిశాకరస్స్యాత్ ॥

తా॥ నదీతటాకాదులందు సమృద్ధమైన జలము, ప్రజలలో శక్త్యుత్సాహములు వెలలు మితిలేక పెరుగుటయు కల్గును. ఇది చంద్రుడు మేఘాధిపతియైన ఫలము.

### రసాధిపతేః రవేః ఫలమ్

కార్పాసతైలేక్షుగుడాదికానాం మహార్ఘతా శీతభయం జనానామ్ ।
వాపీతటాకాదిషు తుచ్ఛమంబు రసాధినాథో దినకృద్యదా స్యాత్ ॥

తా॥ ప్రత్తి, తైలము, చెఱకు, బెల్లము మొదలగు వస్తువులకు ధరలధికమగుట, చలిబాధ యెక్కువగుట, వాపీకూప తటాకాదులం దుదకము క్షీణించుట కలుగును. ఇది సూర్యుడు రసాధిపతియైన ఫలము.

### నీరసాధిపతేశ్శుక్రస్య ఫలమ్

కర్పూరాగరుగంధానాం హేమమౌక్తికవాససామ్ ।
వృద్ధయోఽర్ఘేణ జాయంతే శుక్రే నీరసనాయకే ॥

తా॥ కర్పూరము, అగరు, గంధద్రవ్యములు, బంగారు, ముత్యములు, వస్త్రములు వీట్లకు ధరలు హెచ్చగును. ఇది శుక్రుడు నీరసాధిపతియైన ఫలము.

### పశుపాలకస్థానసంజ్ఞకస్య గోపాలస్య ఫలమ్

పశువృద్ధిస్సుభిక్షం చ బహుసస్యార్ఘసంపదః ।
సంపూర్ణతృణవృద్ధిస్స్యాద్గోపాలే పశునాయకే ॥

తా॥ పశువృద్ధియు, సుభిక్షము, సస్యవృద్ధియు, వెలలు హెచ్చులో నుండుట, తృణవృద్ధియు శ్రీగోపాలమూర్తి పశునాయకుడైన ఫలముగా నుండును.

## పుష్కలనామక మేఘఫలమ్

మందవృష్టిర్మందతోయం మహావాయుః ప్రవర్తతే ।
లక్షణం పుష్కలాభ్రస్య సర్వమూలాని నాశయేత్ ॥

తా॥ స్వల్పవృష్టి, స్వల్పతోయము మహావాయువు ననునివి పుష్కలమను మేఘమునకు ఫలము

మేరోరీశాన్యదిగ్భాగే మేఘోత్పత్తిః ॥ చతురాఢకపరిమితం వర్షం । ఆవహనామకో వాయుః । వాసుకినామకశ్శేషః ॥

ఆఢకప్రమాణమ్ ॥ ఆశీతయోజనం దివ్యం విస్తీర్ణం చోన్నతం శతం । ఆఢకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే ॥

## మకరసంక్రాన్తిఫలమ్

ఏతత్సంవత్సర పుష్య బ ౮ శుక్రవారం చిత్తానక్షత్రే కౌలవకరణే సుకర్మనామయోగే ప్రథమ యామే మకరలగ్నే రవేర్మకరరాశిప్రవేశః ॥

శ్లో॥ త్రిశీర్షం ద్విముఖం చైవ చతుర్వక్త్రం త్రినేత్రకమ్ ।
పంచవర్ణం రక్తదంతం లంబభ్రూర్దీర్ఘనాసికమ్ ॥
అష్టబాహుం ద్విపాదం చ వికృతం కృష్ణవర్ణకమ్ ।
శతయోజనమౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశ స్మృతమ్ ।
ఏవం రూపం హి విజ్ఞేయం సంక్రాన్తిపురుషస్య చ ॥

అస్య పురుషస్య మిశ్రనామధేయం - పశూనామరిష్టం । శంఖస్నానం - సుఖం । హరిద్రావస్త్రం - యుద్ధభయం । కుంకుమగంధలేపనం - స్త్రీణాం నాశనం । పగడపుష్పధారణం - క్షుద్భయం । రజత భూషణం - అత్యర్ఘం । తామ్రపాత్రభోజనం - లోహనాశనం । భక్ష్యాద్యాహారము - ప్రజాపీడా । చూత ఫలభక్షణం - నర్తకానామరిష్టం । అసి ఆయుధం - క్షుద్భయం । పీతఛత్రధారణం - శుభం । వరాహ వాహనము - రాజులకు భయము । లజ్జాముఖము - వర్షాధిక్యము । నివిష్టోభవతి - క్షుద్భయం । ఉత్తర యానము - తద్దేశారిష్టము । కృష్ణపక్షము - సుభిక్షము । తిథిఫలం - క్షేమారోగ్యములు సంభవించును. జంతువులకరిష్టము । అష్టమి - పృథివీవృద్ధి । శుక్రవారం సుభిక్షము, సువృష్టి । ప్రాతఃకాలము - రాజ్ఞాం అరిష్టం । మకరలగ్నం - యుద్ధము । రెండవ ముహూర్తం - శుభం । సంక్రాన్తిపురుషోత్పత్తికాలే దానం స్వశక్తితః । ఫలం కాంస్యాది దానాని దీయతే దోషనాశనం ॥

తా॥ మూడు తలలు, రెండు ముఖములు, నాలుగు నోళ్లు, మూడు నేత్రములు, ఐదు చెవులు, యెఱ్ఱని కండ్లు, విశాలమగు కనుబొమ్మలు, పొడవగు ముక్కు, యెనిమిది బాహువులు, రెండు పాద ములు, యెఱ్ఱని వికృతాకార శరీరము కలిగి నూరు యోజనముల యెత్తు, పండ్రెండు యోజనముల లావు కలిగిన శరీరముతో యీయేడు సంక్రాన్తిపురుషుడున్నాడు.

## అథ వర్షధాన్యాదయః

వర్షం ౧౫, ధాన్యం ౯, శీతం ౯, తృణం ౧౧, ఉష్ణం ౫, మారుతం ౧౩, ప్రజావృద్ధి ౧౫, తన్నాశం ౧౫, రాజవిద్వరం ౫, పుణ్యం ౫, పాపం ౫, వ్యాధి ౧౯, తదుపశమనం ౧౫, ఆచారం ౧౧, అనాచారం ౧౯, జన్మాని ౬, దేశోపద్రవం ౧౧, దేశస్వాస్థ్యం ౨, చోరభయం ౧౧, తన్నాశం ౧౩, అగ్నిభయం ౧౫, శాంతి ౧౯, మృగోపద్రవం ౯, తత్క్షయం ౩, కీటకభయం ౩, తన్నాశః ౧౧, మూషక వృద్ధి ౧౫, తన్నాశః ౧౨, సర్పవృద్ధి ౩, నాశం ౨, కామం ౬, లోభం ౧౩, మదం ౯, మాత్సర్యం ౧౯, సుఖం ౯, దుఃఖం ౧౩, భోగః ౧౩, విద్వరం ౧౫, మనోవ్యథ ౧౩, ద్వేషం ౧౩, ప్రతిష్ఠ ౧౧, ద్యూతం ౩, మత్తత ౧౧, పురుషోత్పత్తిః ౧౯, స్త్రీణాముత్పత్తిః ౯, ధాతువృద్ధి ౧౫, భయం ౨, క్రౌర్యం ౨, దుష్టనిగ్రహం ౧౧, శిష్టపాలనం ౧౫, సత్యం ౧౯, అసత్యం ౫, విశ్వాసం ౨, అవిశ్వాసం ౯, దయ ౧౧, నిర్దయ ౧౩, న్యాయం ౧౧, అన్యాయం ౧౩, సస్యవృద్ధి ౮, తన్నాశః ౨, పశువృద్ధి ౬, నాశః ౪, శశవృద్ధి ౫, నాశః ౩, మత్కుణవృద్ధి ౮, తన్నాశః ౩, తృష్ణా ౧, నిద్రా ౫, ఆలస్యం ౩, ఉద్యోగం ౧౩, శాంతి ౩, క్రోధం ౩, మిత్రభేదం ౧, ఇష్టత ౧౩, రసనిష్పత్తిః ౨, ఫలనిష్పత్తిః ౧౩, ఉత్సాహం ౯, జ్ఞానం ౩, అజ్ఞానం ౩, కాపట్యం ౧౩, నిష్కాపట్యం ౯, ధార్మికత్వం ౧౨, అధార్మికత్వం ౧, గోమాయువృద్ధి ౪, తన్నాశః ౧, సస్యకీటకవృద్ధి ౧౩, తన్నాశః ౧౦, శలభవృద్ధి ౧౩, నాశం ౧, మశకవృద్ధి ౪, నాశం ౪, వృక ౧, నాశం ౧౦, వ్యాఘ్రవృద్ధి ౧౩, నాశం ౧౪, పక్షివృద్ధి ౫, నాశం ౪, ధేనువృద్ధి ౫, నాశం ౪, మహిషవృద్ధి ౩, నాశం ౩, మృగవృద్ధి ౪, నాశం ౫, ఛాగవృద్ధి ౩. నాశం ౩, అజవృద్ధి ౩, నాశం ౫, గజవృద్ధి ౫, నాశం ౫, ఉష్ట్రవృద్ధి ౧, నాశం ౧, విప్రవృద్ధి ౪, నాశం ౪, వైశ్యవృద్ధి ౪, శూద్రవృద్ధి ౪, నాశం ౩, మ్లేచ్ఛవృద్ధి ౩, నాశం ౧, సంకరవృద్ధి ౨, నాశం ౫, నవరత్నవృద్ధి ౧, నాశం ౪, మరకతవృద్ధి ౭, మాణిక్యవృద్ధి ౪, వజ్రవృద్ధి ౧, వైడూర్యవృద్ధి ౭, గోమేధికవృద్ధి ౩, పుష్యరాగవృద్ధి ౪. పగడం ౫, స్వర్ణం ౧౦. రజతం ౪, తామ్రం ౪. కాంస్యం ౪, లోహవృద్ధి ౦, అయోవృద్ధి ౮. త్రపు ౧౦, సీసం ౬, వ్రీహి ౬, శాలి ౧౪. కుళుత్థం ౧౦, తిలం ౪, మాషం ౪, ముద్గం ౧౬, చణకం ౧౦, సర్షపం ౪, ఆఢకం ౪, గోధుమవృద్ధి ౧, కోద్ర వృద్ధి ౪. ప్రియంగువృద్ధి ౧౦, యావనాళవృద్ధి ౧౭, శ్యామాకవృద్ధి ౫, రాజమాషవృద్ధి ౧౪, పనస ౪. నారికేళం ౧౪, స్వచక్రభయం ౧, పరచక్రభయం ౯, స్వప్నం ౧౦, సుషుప్తి ౪, జాగ్రత ౪, పిశు నత్వం ౬, అండజవృద్ధి ౧౫, జరా ౧౧, స్వేదజం ౯, ఉద్భింజ్జ ౮, స్థావరజం ౫, జలజం ౧౧, శిలాపాతం ౫. గర్జితం ౩, విద్యుత్ ౧౫.

## జ్యేష్ఠప్రతిపదిందువారఫలమ్

సుభిక్షం క్షేమమారోగ్యం వృష్టిస్సస్యవివర్ధనమ్
ఆనందనిరతా ధాత్రీ జ్యేష్ఠాదౌ చేందువాసరే ॥

తా॥ సుభిక్షము, క్షేమము, ఆరోగ్యము, వృష్టి సస్యముల యభివృద్ధియు గలిగి భూమాత నిరంతరానందభరితయైయుండుట జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి సోమవారముతో కూడిన ఫలము.

### ఆషాఢ శుక్ల పంచమీ స్థిరవారఫలమ్

ఆషాఢసితపంచమ్యాం మందకావారో భవేద్యది ।
లోకానాం భయపీడా చ దుర్భిక్షమధికం ధ్రువమ్ ॥

తా॥ లోకమందు దుర్భిక్షము, భయపీడయును నవి కల్గుట ఆషాఢ శుద్ధ పంచమి శనివారముతో కూడిన ఫలమగును,

### ఆషాఢ శుక్ల నవమీ చిత్రా నక్షత్రఫలమ్

ఆషాఢస్య సితే పక్షే నవమీ త్వాష్ట్ర సంయుతా ।
సర్వసస్యసమృద్ధిస్స్యాత్ప్రమోదంతే నిరామయాః ॥

తా॥ సర్వసస్యసమృద్ధి కలిగి ఆరోగ్యవంతులై ప్రజలు సుఖింతురనునది ఆషాఢ శుక్ల నవమీ తిథి చిత్రానక్షత్రముతోకూడిన ఫలమగును,

### ఆషాఢకృష్ణపక్ష ఏకాదశీ రోహిణీయుతఫలమ్

ఆషాఢకృష్ణపక్షేతు రోహిణ్యేకాదశీయుతౌ ।
సర్వధాన్యాభివృద్ధిస్స్యాత్సువృష్టిశ్చ మహీతలే ॥

తా॥ చక్కని వృష్టికలిగి సర్వసస్యములు బాగుగా ఫలించుననుట ఆషాఢ బహుళ ఏకాదశి రోహిణీ నక్షత్రముతోకూడియుండిన ఫలమగును.

### ఆర్ద్రాప్రవేశకాలతిథ్యాదిఫలాని

జ్యేష్ఠ బహుళ ౭ మీ సోమవారం ౩౦-౩౩ ఘడియలకు రవికి ఆర్ద్రాప్రవేశమగుటచే ఏతత్ఫలము :—

వృష్టిస్స్యాత్సోమవారే తు రాత్రౌ సస్యాభివృద్ధయే ।
సౌభాగ్యే శుభదం ప్రోక్తం బాలవే చ సుభిక్షకమ్ ।
మేషే శుభకరం ప్రోక్తమార్ద్రాప్రావేశికం ఫలమ్ ॥

తా॥ సోమవారం రాత్రి సూర్యుడార్ద్రయందు ప్రవేశించుటవలన సస్యవృద్ధి ఫలమగును. అట్లే ఆనాడు సౌభాగ్యయోగమగుటచే శుభమగును. బాలవకరణమగుటచే సుభిక్షము, మేషలగ్న శుభసమయ మగుటచే శుభమును చేకూరును. చంద్రమండలఫలమతివృష్టిః.

వర్షవిభాగః ॥ దశభాగాన్సముద్రేషు పర్వతేషు తథా నవ ।
ద్వౌ భాగౌ భువి సంప్రోక్తౌ ఏవం వర్షతి చ త్రిధా ॥

## అథ కందాయఫలమ్

| అశ్వి | భర | కృత్తి | రో | మృ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౮ | ౨ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ |

| మఖ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త | స్వా | విశా | అనూ | జ్యే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౮ | ౨ | ౫ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౦ | ౪ | ౨ |

| మూ | పూ-షా | ఉ-షా | శ్ర | ధని | శత | పూ-భా | ఉ-భా | రేవ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౮ | ౨ | ౫ | ౦ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ |

## ఆదాయ వ్యయౌ

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషం | ఆ. | ౨ | వ్య. | ౭ | సింహం | ఆ. | ౧౧ | వ్య. | ౫ | ధనస్సు | ఆ. | ౫ | వ్య. | ౧౪ |
| వృషభం | ,, | ౧౧ | ,, | ౧౪ | కన్య | ,, | ౧౪ | ,, | ౧౧ | మకరం | ,, | ౭ | ,, | ౭ |
| మిథునం | ,, | ౧౪ | ,, | ౧౧ | తులా | ,, | ౧౧ | ,, | ౧౪ | కుంభం | ,, | ౭ | ,, | ౭ |
| కటకం | ,, | ౭ | ,, | ౧౧ | వృశ్చికం | ,, | ౨ | ,, | ౭ | మీనం | ,, | ౫ | ,, | ౧౪ |

సకల ఆదాయ వ్యయములు ౫౯ — ౮౧.

ఆదిశూన్యే మహావ్యాధిర్మధ్యశూన్యే మనోవ్యథా । అంత్యశూన్యే ఫలం స్వల్పం త్రిశూన్యే నిష్ఫలం భవేత్ ॥
విషమే త్వర్థలాభః స్యాత్సమే తు సమతా భవేత్ । శూన్యే శూన్యమవాప్నోతి కందాయఫలమీదృశమ్ ॥

కర్తరీనిర్ణయము ॥ వైశాఖ శుక్ల ౧౦ సోమవారం (10—5—65) మొదలు బహుళ ద్వాదశీ శుక్రవారం (28—5—65) వరకు నిజకర్తరీ.

## గురుశుక్రమౌఢ్యకాలము

క్రోధి సంవత్సర మాఘ బహుళ ౧౧ శనివారం మొదలు శ్రీ విశ్వావసు సంవత్సర వైశాఖశుక్ల పంచమీ వరకు శుక్రమౌఢ్యమ్ ॥ మరల మాఘమాస శుక్ల ౨ ద్వితీయా ఆదివారం మొదలు మాఘశుక్ల ౬ షష్ఠీ గురువారము వరకు శుక్రమౌఢ్యమ్ ॥ విశ్వావసు సంవత్సర వైశాఖ బహుళ ౨ ద్వితీయా సోమవారము మొదలు జ్యేష్ఠ శుక్ల ౧౫ ఆదివారము వరకు గురుమౌఢ్యమ్ ॥

బుధా స్తమయోదయఫలమ్ ॥ అవర్షే కురుతే వర్షం వర్షే కర్షం ప్రయచ్ఛతి । భయే చ కురుతే క్షేమం సర్వత్ర ప్రతిలోమగః । ఆర్ద్రాదిపిత్ర్యభాంతేషు దృశ్యతే యది సోమజః । వాపీకూపతటాకాశ్చ శుష్యంతి యది కాలతః । ప్రాచ్యాం బుధోదయచరః హస్తానక్షత్రసోమజః । నృణాం సుభిక్షమారోగ్యం కరోతి పశునాశనమ్ ॥

తా॥ వర్షము లేనపుడు వర్షము, వర్షమున్నయెడల కొంచెమధికము, భయము కల్గినపుడు క్షేమము, వాపీతటాకములందు నీరు యెండిపోవుట మొదలగు ఫలముల యీయేటి బుధా స్తమయోదయములకు ఫలమగును.

గురుచారఫలమ్ ॥ వత్సరాద్యాషాఢ శుక్ల ౯ నవమీ గురువారం వరకు వృషభరాశియందును. తదుపరి పుష్య బహుళ ౩ తృతీయా ఆదివారం వరకు మిథునరాశియందును, తత్పరం ఆవత్సరం వృషభ రాశియందును బృహస్పతి సంచరించుటచే తత్ఫలం ॥ వృషరాశౌ యదా జీవో వైశాఖో వత్సర స్తథా । నందకాలో భవేన్మేఘః సర్వధాన్యసమర్ఘతా ॥ వైశాఖే ఆశ్వినే మాసే స్త్రీణాం రోగాశ్చ దంతినామ్ । అశ్వానాం చ మహాపీడా గృహవైరం పరస్పరమ్ ॥

తా॥ బృహస్పతి వృషభరాశియందుండు కాలము మంచిది. అప్పుడు సుభిక్షము, ధాన్యసమృద్ధి వెలలు ఒడుదుడుకులేక నిలచియుండుటయు, మిథునమాసమందుండినపుడు స్త్రీలకు, యేనుగులకు, గుఱ్ఱములకు రోగపీడ, గృహకల్లోలములు కలుగును.

శుక్రచార ఫలమ్ ॥ వైశాఖ శుక్ల ౫ పంచమీ గురువాసరే పశ్చాదుదితః శుక్రః — యుద్ధభయం ప్రజానాం చ అత్యర్ఘో ధాన్యరాశయః । రోగాధిక్యం పశూనాం చ మాషసర్షపన్యూనతా ॥ శుక్రోదయే సుఖం సర్వసుభిక్షం సర్వదేశకే ॥

తా॥ ప్రజలలో యుద్ధభయము. ధాన్యములకు వెల హెచ్చుట, పశురోగములు, మినుములు, ఆవాలు కఱవగుట శుక్రచారమునకు ఫలమగును. ఐనను శుక్రోదయకాలబలములచే సుభిక్షముచే అందరు సుఖింతురు.

శనిచారఫలమ్ ॥ సంవత్సరాంతం కుంభరాశియందుండుటచే దేశక్షేమము, ధర్మాధర్మ విచారము రాజులకు జనులకు సర్వసౌఖ్యము.

గ్రహణము ॥ విశ్వావసు కార్తిక బహుళ ౩౦ మంగళవారం (23—11—1965) కేతుగ్రస్త సూర్యోపరాగః । పశ్చిమవాయవ్యమధ్యే స్పర్శః । ప్రాగీశాన్యమధ్యే మోక్షః । అర్ధాధికగ్రాసః ॥ ఉదయాది స్పర్శకాలః ఘ ౨-౦ (ఘం. 7—5 ని.). మధ్యకాలః ఘ ౪-౪౬ (ఘం. 8-11 ని.) శుద్ధమోక్షకాలః ఘ. ౭-౩౨ (ఘం. 9-18 ని.). ఆద్యంతపుణ్యకాలః ఘ ౫-౩౨ (ఘం. 2-13 ని.). గ్రహణమాస ఫలమ్ ॥ శ్లో॥ కార్తిక్యాం నిషధోపదేశనృపతీన్కాశ్మీరదేశాధిపం హన్యాదాశు కళింగదేశనృపతిం సామాత్య భృత్యం తమః ॥ తా॥ కాశ్మీరనిషధకళింగదేశరాజులకు హాని సంభవించును. ప్రత్యాబ్దికశ్రాద్ధభోజనాదులు యథావిధిగా జరుపుకోవచ్చును.

# సుముహూర్తములు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేనెల '65 | 9 | వైశాఖ | శుక్ల | ౯ | ఆదివారము | మఖ | మిథునం | వివాహము | ప గం॥ | 9-47 |
| | 12 | ,, | ,, | ౧౨ | బుధవారము | హస్త | ,, | ,, | ప గం॥ | 9-22 |
| జూన్ నెల | 4 | జ్యేష్ఠ | ,, | ౫ | శుక్రవారము | పుష్య | కటకం | అన్నప్రాశన | ప గం॥ | 9-00 |
| | 9 | ,, | ,, | ౧౦ | బుధవారము | చిత్త | ,, | ,, | ప గం॥ | 8-40 |
| | 23 | ,, | బ | ౯ | బుధవారము | రేవతి | ,, | వివాహము | ప గం॥ | 7-45 |
| | 23 | ,, | బ | ౯ | బుధవారము | రేవతి | మకరం | ,, | రా గం॥ | 9-04 |
| | 24 | ,, | బ | ౧౦ | గురువారము | అశ్వ | కటకం | ,, | ప గం॥ | 7-40 |
| జూలై నెల | 1 | ఆషాఢ | శుక్ల | ౨ | గురువారము | పుష్య | ,, | అన్నప్రాశన | ప గం॥ | 7-14 |
| | 5 | ,, | ,, | ౭ | సోమవారము | ఉ-ఫ | ,, | ,, | ప గం॥ | 7-00 |
| | 8 | ,, | ,, | ౧౦ | గురువారము | స్వాతి | ,, | ,, | ప గం॥ | 6-44 |
| | 29 | శ్రావణ | ,, | ౧ | గురువారము | మఖ | మిథున | వివాహము | రా గం॥ | 4-32 |
| ఆగష్టు నెల | 5 | ,, | ,, | ౯ | గురువారము | అనూ | ,, | ,, | రా గం॥ | 4-04 |
| | 21 | ,, | బ | ౯ | శనివారము | రోహి | కన్యా | వివాహ-అన్న | ఉ గం॥ | 8-44 |
| | 22 | ,, | బ | ౧౦ | ఆదివారము | మృగ | ,, | ,, | ఉ గం॥ | 8-40 |
| సెప్టంబర్ | 8 | భాద్ర | శుక్ల | ౧౩ | బుధవారము | శ్రవణ | ,, | అన్నప్రాశన | ఉ గం॥ | 7-34 |
| | 13 | ,, | బ | ౨ | సోమవారము | రేవతి | ,, | ,, | ఉ గం॥ | 7-14 |
| | 26 | ఆశ్వ | శుక్ల | ౧ | ఆదివారము | హస్త | తులా | వివాహాది | ఉ గం॥ | 9-10 |
| | 26 | ,, | ,, | ౧ | ఆదివారము | చిత్త | మిథున | గృహప్ర-వివా. | రా గం॥ | 12-36 |
| అక్టోబర్ | 10 | ,, | ,, | ౧౫ | ఆదివారము | రేవతి | ,, | వివాహము | రా గం॥ | 11-36 |
| | 30 | కార్తిక | ,, | ౬ | శనివారము | ఉ-షా | కన్యా | గృహప్ర-వివా. | తె గం॥ | 4-03 |
| | 31 | ,, | ,, | ౭ | ఆదివారము | ,, | మిథున | ,, | రా గం॥ | 10-23 |
| నవంబర్ | 3 | ,, | ,, | ౧౦ | బుధవారము | శతభిష | ధనస్సు | గృహారంభాది | ప గం॥ | 10-45 |
| | 28 | మార్గశిర | ,, | ౫ | ఆదివారము | శ్రవణ | కన్యా | వివాహాది | రా గం॥ | 2-12 |
| డిశంబర్ | 3 | ,, | ,, | ౧౦ | శుక్రవారము | ఉ-భా | మకరం | ,, | ప గం॥ | 10-22 |
| | 3 | ,, | ,, | ౧౦ | శుక్రవారము | రేవతి | కన్యా | ,, | రా గం॥ | 1-50 |
| | 30 | పుష్య | ,, | ౭ | గురువారము | ఉ-భా | మీనం | అన్నప్రాశన | ప గం॥ | 11-34 |
| జనవరి 66 | 27 | మాఘ | ,, | ౬ | శుక్రవారము | రేవతి | ,, | ఉపనయనాది | ప గం॥ | 9-24 |
| ఫిబ్రవరి | 2 | ,, | ,, | ౧౨ | బుధవారము | మృగ | ,, | ,, | ప గం॥ | 9-00 |
| | 3 | ,, | ,, | ౧౩ | గురువారము | పునర్వ | కన్యా | వివాహము | రా గం॥ | 9-56 |
| | 10 | ,, | బ | ౫ | గురువారము | చిత్త | మీనం | ఉపనయనాది | ప గం॥ | 8-52 |
| | 11 | ,, | బ | ౬ | శుక్రవారము | స్వాతి | కన్యా | వివాహాది | రా గం॥ | 9-23 |
| | 23 | ఫాల్గుణ | శుక్ల | ౩ | బుధవారము | ఉ-భా | మీనం | ఉపనయనాది | ఉ గం॥ | 7-58 |
| | 23 | ,, | ,, | ౩ | బుధవారము | రేవతి | మకరం | వివాహాది | తె గం॥ | 4-56 |
| | 24 | ,, | ,, | ౪ | గురువారము | అశ్వని | ,, | వివాహాది | తె గం॥ | 4-52 |

| ఫిబ్రవరి | 25 | ఫాల్గుణ | శుక్ల | ౫ | శుక్రవారము | అశ్వని | మీనం | ఉపనయనము | ఉ గం॥ | 7-56 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 27 | ,, | ,, | ౭ | ఆదివారము | రోహిణి | మకరం | వివాహాది | తె గం॥ | 4-40 |
| మార్చినెల | 2 | ,, | ,, | ౧౦ | బుధవారము | పునర్వసు | ,, | ,, | తె గం॥ | 4-30 |
| | 4 | ,, | ,, | ౧౨ | శుక్రవారము | ఆశ్లేష | ,, | వాపీకూపాది | తె గం॥ | 4-22 |
| | 9 | బ | బ | ౩ | బుధవారము | హస్త | మేష | ఉపనయనాది | ప గం॥ | 9-33 |
| | 9 | ,, | బ | ౩ | బుధవారము | చిత్త | మకరం | వివాహము | తె గం॥ | 4-00 |
| | 10 | ,, | బ | ౪ | గురువారము | స్వాతి | ,, | ,, | తె గం॥ | 3-56 |

## వర్షయోగము

**చైత్రమాసము ॥** ఈ మాసమంతయు వక్రాంగారక సింహారాశిగతుడై, పురోబుధ - పురశ్శుక్రగతుడై, గుర్వగ్రకుజుడు ఇత్యాద్యనావృష్టియోగము లుండినా బుధవక్రము, బుధ శుక్రులకేకరాశిసంయోగము, శుక్రగాఢాస్తమయము, ఇత్యాది స్వల్పసంయోగమువల్ల అచ్చటచ్చట వర్షముండును.

**వైశాఖమాసము ॥** సింహాంగారక పురశ్శుక్ర రవులు గురు శుక్రులకేకరాశ్యంశయోగము, శుక్రోదయము గుర్వస్తమనము ఇత్యాదులచే ఖండవృష్టి గల్గును,

**జ్యేష్ఠమాసము ॥** మృగశిరార్ద్రికార్తులలో మాసాంత్యమువరకు సింహాంగారకగుర్వగ్రకుజుడు, శుక్ర పురోబుధుడు, కుజునకు రాశ్యంతరచలనము, బుధ శుక్రులకేకరాశియోగముండుటచే అల్పవర్షముగా, ఖండవృష్టిగా అచ్చటచ్చట వర్షించును.

**ఆషాఢమాసము ॥** ముందుగల గ్రహాదిదోషములు, పునర్వసు. పుష్యకార్తులయందుండుట బహుళమున స్వల్పవృష్టి యేర్పడవచ్చును.

**శ్రావణమాసము ॥** ఆశ్లేష, మఖకార్తెలు పశ్చిమమఖాది పంచకశుక్రుడు. గురు బుధవక్రము, శుక్రవరుణ యుతి, చిత్తాంగారకుడు, తులకు కుజచలనం ఇత్యాది వర్షయోగములు మిశ్రమముగా వున్నవి. శుక్లమున మంచి వర్షమున్ను, బహుళమున గాలితోకూడిన వర్షమున్ను వర్షించును.

**భాద్రపదమాసము ॥** స్వాత్యంగారకుడు, మఖాదిపంచక శుక్రుడు, శుక్రాగ్రకుజుడు ఇత్యాద్యనావృష్టియోగ ముండినను, పశ్చిమస్వాతిత్రయశుక్రుడు, కుజచలనం ఇత్యాది వర్షయోగముండుటచే నదీనదములు విశేషముగా ప్రవహించదగిన వర్షము కురియును.

**ఆశ్వయుజమాసము ॥** పురశ్శుక్ర పురోబుధ కుజ శుక్ర అగ్రగతులు. హస్త చిత్తకార్తులయందు స్వాతిత్రయ శుక్రుడు, విశాఖాంగారకుడు వర్షయోగములుండుటచే గాలితోకూడిన వర్షము లప్పుడప్పుడు వర్షిస్తూయుండును.

**కార్తికమాసము ॥** ఈనెలలో ధనూరాశియందు కుజచలనము, పురోబుధుడు. వృశ్చికమున కుజ శుక్ర బుధులు, బుధవక్రము ఇత్యాది సుయోగముబుండుటచే అనూరాధ కార్తియందు సస్యానుకూల వృష్టి కురియును.

**మార్గశీర్షమాసము ॥** శుక్ర పురోబుధుడు, ఉత్తరాషాఢాంగారకుడు, బుధవక్ర కుజ చలనాది సుయోగములచే దక్షిణదేశమున కావేర్యాదినదులు ప్రవహించి సుభిక్షముగా నుండును.

## 1. సంవత్సరఫలమును చూచుట

శ్లో॥ చైత్రాదితిథివారర్క్షం యోగం కరణసంయుతమ్। జన్మనక్షత్ర సంయుక్తం సప్తభిర్భాగమాహరేత్॥
అర్థలాభం మనస్తాపం రాజమానం చ యుద్ధతః। భూషణం రోగమాయుష్యం సంవత్సరఫలం లభేత్॥

తా॥ తెలుగు సంవత్సరాదినాటి తిథి వారము నక్షత్రము యోగము కరణము వీటి సంఖ్యను జన్మనక్షత్రసంఖ్యతో కూడి ౭ చే భాగించగా వచ్చిన శేషము ౧ అర్థలాభము, ౨ మనస్తాపము, ౩ రాజపూజ్యత, ౪ యుద్ధము, ౫ భూషణము, ౬ రోగము, ౭ ఆయుష్యము ఇవి సంవత్సర ఫలములుగా తెలియునది.

## 2. మాసఫలము

శ్లో॥ శుక్లాది తారమారభ్య జన్మభాంతం చ గణ్యతే।
నవసంఖ్యాహరేచ్ఛేషం మాసి మాసఫలం స్మృతమ్॥

తా॥ శుక్లపక్షపాడ్యమియొక్క ప్రవేశమునందు యే నక్షత్రముండునో ఆ నక్షత్రము మొదలుకొని జన్మ క్షత్రమువరకు లెక్కించి అయిన సంఖ్యను తొమ్మిదిచే భాగింపగా మిగిలిన సంఖ్యకు క్రింది శ్లోకములోని ఫలములు మాసఫలములని తాత్పర్యము.

శ్లో॥ పంథాః సుభోజ్యం తనుతాపశౌర్యే విద్యా చ వస్త్రం విపులం చ శోకమ్।
అనంతపుణ్యం చ మహాఫలం చ నవేతి మాసస్య ఫలాని చాహుః॥

తా॥ ౧ త్రోవనడచుట, ౨ మంచిభోజనము, ౩ శరీరసంతాపము, ౪ శౌర్యము, ౫ విద్యాలాభము ౬ వస్త్రలాభము, ౭ దుఃఖాధిక్యము, ౮ అనంతపుణ్యము, ౯ విశేషఫలము. ఈ పైచెప్పిన ౯ మాసముల ఫలము.

## 3. దినఫలము

దినఫలము॥ జన్మనక్షత్రము మొదలు దిన నక్షత్రమువరకు ఆదివారము మొదలు నాటివారము వరకును యెంచి వచ్చినలెక్కను ౯ తో భాగించగా, శేషము ౧ వ్యాకులము, ౨ శుభం, ౩ క్రూరము, ౪ బంధుదర్శనము, ౫ స్త్రీ సంభోగము, ౬ శుభము, ౭ కలహము, ౮ రోగము, ౯ మంచిమాటలు కలుగును.

## 4. వాస్తుపురుష లక్షణము

భాద్రపదాశ్వయుజ కార్తికమాసములయందు పూర్వశిరస్సుగాను, మార్గశిర పుష్య మాఘమాసములయందు యామ్యశిరస్సుగాను, ఫాల్గున చైత్రవైశాఖమాసములయందు పశ్చిమ శిరస్సుగాను, జ్యేష్ఠాషాఢ శ్రావణమాసములయందు ఉత్తర శిరస్సుగాను వాస్తుపురుషుడు వామహస్తమును తలక్రిందనుంచుకొని పవళించి యుండును. గనుక యాతనిదృష్టి ప్రచారదిశలయందును పాదములుండుదిక్కునను గృహమును కట్టరాదు.

## 5. జన్మలగ్నమును తెలిసికొనుట

శ్లో॥ చంద్రలగ్నాధిపో యత్ర తత్త్రికోణమథాపి వా।
తత్సప్తమత్రికోణం వా ఇతి లగ్నస్య నిర్ణయః॥

తా॥ చంద్రలగ్నమనకు చంద్రుడున్న రాశ్యధిపతి యెక్కడ నుండునో అదిమొదలు ౧-౫-౯ జన్మలగ్నము. అటుగాకపోతే ౩-౭-౧౧ జన్మలగ్నము కావలెను.

## 6. జన్మనక్షత్రము తెలిసికొనుట

కేరళరహస్యే॥ శ్లో॥ పృచ్ఛకస్య తు లగ్నం తు వేదఘ్నం నాడిసంయుతమ్ ।
చరేషు పంచభిర్యుక్తం స్థిరేషు దశభిర్యుతమ్ ॥
ద్విస్వభావే సప్తయుక్తం సప్తవింశతిభాజితమ్ ।
శేషం తు జన్మనక్షత్రమిత్యుక్తం కాలకోవిదైః ॥

తా॥ ప్రశ్నలగ్నమును ౪ తో పెంచి, అప్పటికైన ఘటికలను కూడి, చరరాశికి ౫న్ను, స్థిరరాశికి ౧౦న్ను, ద్విస్వభావరాశికి ౭న్ను కూడి, ౨౭ తో భాగించగా వచ్చిన శేషము జన్మనక్షత్రమని తెలియవలెను.

## 7. స్త్రీ పురుషాదివివేక గర్భప్రశ్న

శ్లో॥ లగ్నాద్భాగ్య కళత్ర పుత్ర సహజేష్వర్కార జీవాః స్థితాః
చేత్పుత్రం ధనమాతృరంధ్ర రిపుగౌ చేచ్చంద్రశుక్రౌ వధూమ్ ।
తేష్వర్కీందుసుతౌ నపుంసకమితి ద్విర్భావలగ్నే యది
సృచ్ఛేత్తజ్జననీగృహే ఖగయుగం చేద్యుగ్మగర్భం వదేత్ ॥

తా॥ ప్రశ్నకాలీన లగ్నమునకు ౯, ౭, ౫, ౩ స్థానములయందు రవ్యంగారక గురువులున్న యెడల పురుష శిశువు గలుగుననియు, ఆ ప్రశ్నలగ్నమునకు ౨, ౪, ౮, ౬ స్థానములయందు శుక్రచంద్రులుండిరేని స్త్రీ శిశువు గలుగుననియు ఈ స్థానములయందే శనిబుధులున్నయెడల నపుంసకుండనియును, ప్రశ్నలగ్నము ద్విస్వభావలగ్నమై యీలగ్నమునకు నాల్గవస్థానమునందు రెండుగ్రహము లున్నయెడల కవలబిడ్డలు పుట్టుదురనియు తాత్పర్యము.

## 8. నక్షత్రజనితరోగవృత్తిదినములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వినీనక్షత్రమున | ౮ | దినములు పీడించును | పూర్వాషాఢానక్షత్రమున | ౧౫ | దినములు పీడించును |
| కృత్తిక | ౮ | ,, | ఉత్తరాషాఢా | ౨౦ | ,, |
| రోహిణి | ౩ | ,, | శ్రవణం | ౧౦ | ,, |
| మృగశిర | ౫ | ,, | ధనిష్ఠ | ౧౫ | ,, |
| పునర్వసూ } పుష్యమీ } | ౭ | ,, | శతభిషము | ౨౦ | ,, |
| ఆశ్లేష | ౮ | ,, | ఉత్తరాభాద్రా | ౩౦ | ,, |
| పుబ్బ | ౨ | ,, | రేవతి | ౧౦ | ,, |
| ఉత్తర | ౫ | ,, | భరణి | } కష్టముసంభవింపగూడును | |
| చిత్త | ౪౫ | ,, | ఆర్ద్రా | | |
| స్వాతి | ౯౦ | ,, | మఘ | | |
| విశాఖ | ౨౦ | ,, | హస్త | | |
| అనూరాధ | ౧౫ | ,, | మూల | | |
| జ్యేష్ఠ | ౧౫ | ,, | పూర్వాభాద్రా | | |

ఏ యే నక్షత్రమునందు రోగాప్పదమౌనో ఆ నక్షత్రాధిపతులగు గ్రహములకు జపహోమతర్పణ దానాద్యనాదులుచేయ శాంతించి గుణమౌను.

## జననశాంతి నక్షత్రములు

ఉత్తర ౧ పాదము, పుష్యమి ౨, ౩ పాదములు, పూర్వాషాఢ ౩ పాదము, చిత్త ౧, ౨ పాదములు ఆశ్లేష ౪ పాదము, మఖ ౧ పాదము, జ్యేష్ఠ ౪ పాదము, మూల ౧ పాదము, రేవతి ౨, ౩, ౪, పాదములు, అశ్విని ౨, ౩ పాదములు, యీ నక్షత్రములలో శిశువు జన్మించిన యెడల శాంతిని చేసికొనవలయును గ్రంథాంతరమందు, విశాఖ రోహిణీలకు గూడ శాంతి చెప్పబడినది. మాతృపితృభ్రాతల నక్షత్ర మైనను వారి జేష్టన మైనను గూడ శాంతి ముఖ్యకర్తవ్యము

## వర్షములను తెలిసికొనుట.

మృగశిరకార్తిలో వర్షమున్ను, మఖకార్తిలో ఉరుమున్ను, స్వాతికార్తిలో మెరుపున్ను కలిగితే ఆసంవత్సరము చక్కగా వర్షించును. శ్రావణమాసమునందు చిత్త-స్వాతి-విశాఖా ఈ నక్షత్రములయందు చినుకులుపడితే ఆ సంవత్సరము చక్కగా వర్షించును

## తేదివానలు.

ఆని ౧౦ ఆడి ౮ ఆవణి ౬ పెరటాశి ౪ అల్పిశి ౨ కార్తికి ౧ తేదీలలో చినుకులు పడితే ఆ సంవత్సరము చక్కగా వర్షించును.

## సుభిక్షదుర్భిక్షములను దెలిసికొనుట.

చూడవలసిన సంవత్సరమునకు ప్రభవాదిగా యెంచి ఆసంఖ్యను ద్విగుణించి అందులో ౩ ను తీసి మిగిలినదానిని యేడింటభాగించగా మిగిలిన శేషము ౧, ౪ సుభిక్షము ౨, ౫ దుర్భిక్షము ౩ అయితే సమము శూన్యంబైతే శూన్యము.

## వివాహచక్రలక్షణము

శ్లో॥ ఊర్ధ్వరేఖాస్తు చత్వారి తిర్యగ్రేఖా స్తథావధి ।
లిఖిత్వా మధ్యకోష్ఠాది నవకోష్ఠేషు భానుభాత్ ।
నిత్యనక్షత్రపర్యంతం త్రీణి త్రీణి క్రమాల్లిఖేత్ ॥

## ఏతత్ఫలమ్

మధ్యకోష్ఠస్థితం ఋక్షం హంతి సద్యో వధూవరౌ । ప్రాచ్యాం శుభఫలం దద్యాదాగ్నేయ్యాం పుత్రహీనతామ్ కరోతి యామ్యే వైధవ్యం నైఋత్యాం భాగ్యవర్ధనం । పశ్చిమే మరణం కుర్యాద్వాయవ్యాం వ్యభిచారిణీమ్ ఉత్తరే తు ధనం ధాన్య మీశాన్యే సర్వసంపదః । ఏవం వివాహచక్రస్య ఫలం జ్ఞేయం బుధోత్తమైః ॥

## సంవత్సరదశాఫలమ్,

వర్షదశ తెచ్చుటకు అశ్విన్యాది జన్మనక్షత్రమువరకు యెంచి ఆ సంఖ్యను గతాబ్దసంఖ్యతో కూడా చేర్చి మొత్తముచేసి అందులో ౨ తీసి మిగతను ౯ తో భాగించిన శేషము ౧ మిగిలితే సూర్యదశ, ౨ చంద్ర, ౩ కుజ, ౪ రాహు, ౫ గురు, ౬ శని, ౭ బుధ, ౮ కేతు, ౯ శుక్ర దశయగును. దశాప్రమాణ దినములను నక్షత్ర భుక్తిగడియలతో గుణించి నక్షత్రాద్యంత ఘడియలతో భాగించిన లబ్ధము గతదినము. దశాప్రమాణ దినములలో గతదినములను తీసివేయగా మిగిలినది వర్ష ప్రవేశకాలము, మొదలు ప్రథమ దశా శేషదినములగును తర్వాత క్రమముగా ౮ దశలు వ్రాసి అనంతరము ప్రథమదశయందలి గతదినములను వ్రాయవలయును. ఇట్లు సంవత్సరమునకు తొమ్మిది గ్రహదశలు పూర్తియగును. ఈవర్షదశాఫలములు వర్షలగ్నకుండలిలోని గ్రహబలాబలముల ననుసరించి చూడదగినది.

## మౌఢ్యమందు జేయదగని కార్యములు

గురు శుక్రులలో నెవరయినను అస్తంగతుఁ డగుచుండఁగా బావి, కొలను, చెరువు త్రవ్వుట, యాగము, గమనము, క్షౌరకర్మ, దేవతాప్రతిష్ఠ, వివాహోపనయనములు, విద్యారంభము, నూతనగృహారంభము, కర్ణవేధ, మహా దానములు, వనములు స్థాపించుట, పుణ్యతీర్థములు సేవించుట, నూతన మంత్రానుష్ఠాన పట్టాభిషేకములు మొదలయిన సమస్త శుభకర్మములు వర్జింపవలయును. అశుభకర్మలుగాక, తక్కిన వివాహాది శుభకార్యములు క్షయమాసాధిక మాసములయందు చేయఁగూడదు.

## మౌఢ్యమందు జేయదగిన కార్యములు

ఆశ్లేషా మూలాది గండనక్షత్రముల శాంతులకును, రోగసంబంధమైన జపహోమాది శాంతులకును, గ్రహశాంతికిని, అభిషేకము, సమస్తవ్రతములు, ఉత్పాతదోషములు మొదలగువాని శాంతులకును గురు శుక్రమౌఢ్య దోషములులేవు.

## కర్తరిలో జేయదగని కార్యములు

కర్తరియందు చెట్లు నఱకుట, నారతీయుట, కృష్యారంభముచేయుట, విత్తనమువేయుట, భూమినిత్రవ్వుట, క్రొత్తగ్రామమును కట్టుట, గృహమును కట్టుట, క్షౌరము చేసికొనుట, తోటలువేయుట, చెరువులు బావులు త్రవ్వుట, క్రొత్తబండి నెక్కుట ఇట్టికార్యములు చేయఁగూడదు.

## కర్తరిలో జేయదగిన కార్యములు

" మౌంజీబంధే వివాహే చ ప్రవేశే యజ్ఞకర్మణి । భరణీ కృత్తికా చైవ న దోషో మంటపాదిషు "

తా॥ కర్తరియందు ఉపనయనము, వివాహము, ప్రవేశము, యజ్ఞము, మంటపాదులు గట్టుట ఇట్టికార్యములు చేయవచ్చును.

## బాలారిష్టదోషములు

జననకాల లగ్నమునకు చంద్రుడు ౮ టను, కుజుడు ౭ టను, రాహువు ౯ టను, శని ౧ టను, గురుండు ౩ టను, సూర్యుఁడు ౫ టను, శుక్రుడు ౬ టను, బుధుడు ౪ టను, కేతువు ౨ టను, ఉన్నపక్షమున బాలారిష్ట దోషములు సంభవించును. శిశువు జన్మించిన లగ్నమునకు ౧-౫-౬-౭-౮-౧౨ రాసులయందు పాపగ్రహము గూడియుండినను లేక పాపగ్రహములచే జూడబడినను, మరియు క్షీణచంద్రుడు ౧౨-వ రాశియందుండగా ౧-౮-వ రాసులయందు పాప గ్రహములుండినను బాలారిష్టదోషములు సంభవించును.

## బాలారిష్ట దోషభంగములు

శిశు జన్మలగ్నమునకు పై రాసులందు ఆయా గ్రహములుండినను, ఆయా రాసులను బలమగు శుభగ్రహములు చూచినను, కేంద్రములందు ఒక శుభ గ్రహముండినను దోషములేదు.

## * మరణ జనిత దుష్టనక్షత్రములు

మృగశిర - చిత్త - ౨ నెలలు, కృత్తిక - పునర్వసు - ఉత్తర - విశాఖ - ఉత్తరాషాఢా నక్షత్రములకు- ౩ నెలలు, రోహిణి - మఘ నక్షత్రములకు - ౫ నెలలు, ధనిష్ఠ - శతభిషక్ - పూర్వాభాద్రా - ఉత్తరాభాద్రా- రేవతీ నక్షత్రములకు- ౬ నెలలు, పై నక్షత్రములయందు మరణము సంభవించిన యెడల, ఆ యా నక్షత్రమున కేర్పడిన నెలలకాలము ఇంటిని విడువవలెను, శాంతిచేసి ఇంటిలో తిరిగి చేరవలెను.

* కొందరిమతమున, తల్లిదండ్రుల మరణము, పైనక్షత్రాదులలో గలిగిన, ఇల్లు విడువ బనిలేదు. ఇది దేశాచారము ననుసరించినది.

## రజస్స్వలా విషయమై దుష్టతిథివారనక్షత్రములు

ఉభయపక్షంబులందును ౧—౪—౬—౮-౧౨—౧౪—౩౦ యీ తిథులును శని మంగళవారంబులును భరణి, కృత్తిక, ఆర్ద్రా, పునర్వసు, ఆశ్లేష, మఘ, పుబ్బ, జ్యేష్ఠ, పూర్వాషాఢా, పూర్వాభాద్రా, ఈ నక్షత్రములును కూడనివి, కృత్తికయందు రజస్వలయయిన ౪ మాసంబులును, మఘ, ఆర్ద్రా-౬ మాసంబులును - జ్యేష్ఠా-పునర్వసు-ఆశ్లేష-పుబ్బ పూర్వాషాఢా-పూర్వాభాద్రలు- ౧ సంవత్సరమున్ను-భరణి- ౮ మాసంబులును కూడనివి. ఇందులకు ఆ యా నక్షత్రములకు శాంతి చేసి భర్తృవీక్షణము చేయుట గర్భాధానంబు చేసుకొనుట శాస్త్రసమ్మతము.

## నూతన క్షేత్రమునందు కృష్యారంభమునకు ఉక్తకాలము.

శ్లో॥ మైత్రార్క త్రయరోహిణీ వసుమఘా దస్రోత్తరాంత్యాసురే-
ష్వాద్యార్కజ్ఞకవేర్దినేషు శుభదో మధ్యస్తు చాంద్రే దినే।
త్యక్త్వా రిక్తదినాని దగ్ధదివసాన్దర్శావమా వైధృతి-
వ్యాఘాతవ్యతిపాతవిష్టిదివసాఞ్ శేషాః కృషౌ శోభనాః॥ (జ్యోతిషఫలాభిదర్శిని)

తా॥ అనూరాధ, హస్త, చిత్త, స్వాతి, రోహిణి, ధనిష్ఠ, మఘ, అశ్వని, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, మూల ఈ నక్షత్రములును, భాను, భౌమ, బుధ, శుక్రవారములును, నూతనభూమి దున్నుటకారంభించుట చేత, శుభము గలుగుననియును, సోమవారము మధ్యమమనియును, రిక్తతిథులును, దగ్ధతిథులును, పాడ్యమియును, అమావాస్యయును, అవమయును, వైధృతి, వ్యాఘాత, వ్యతీపాతయోగములును, భద్రవాకరణమును, అనువానిని విడిచి పెట్టి, మిగిలినదినములయందు కృషినిచేయుటకు నూతనముగా ప్రవేశించుటచేత శుభములు గలుగును.

## చెరుకు, అరటిచెట్లు, మామిడిచెట్లు మొదలగునవి వేయుటకు ముహూర్తములు

శ్లో॥ రేవత్యుత్తర రోహిణీ గురుకరాదిత్యేషు నక్తంచరే
వాయౌ వారుణ వాజినోశ్చ శశిజేంద్వార్యేషు వారేషు చేత్।
వృక్షస్థాపనబీజవాపనహలప్రారంభకార్యే శుభం
కన్యాకర్కియుగోక్షమీనమకరే సంపూర్ణ ధాత్రీఫలమ్॥

తా॥ రేవతి, ఉత్తర, రోహిణీ, పుష్యమి, హస్త, పునర్వసు, మూల, స్వాతి, శతభిషక్, అశ్వని, ఈ పది నక్షత్రములును, గురు, బుధ, సోమవారములును, కన్యా, కర్కాట, మిథున, వృషభ, మీన, మకరరాసులును, అన్ని విత్తనములు నాటుటకు, కృషికర్మనారంభించుటకు, విత్తనములు చల్లుటకును, ప్రశస్తములయినవి. పై చెప్పబడిన కార్యములను ముహూర్తములు చూచి ప్రారంభించిన, సంపూర్ణముగా సకలసస్యములు ఫలించును.

## ఉల్లితోట వేయుటకు ఉక్తకాలము

శ్లో॥ రేవత్యశ్విని మైత్రవాయువరుణాదిత్యేంద్రవిష్ణీజ్యమూ-
లార్కాన్త్యేందుషు భానుసోమగురువారేష్వేవ వృద్ధిప్రదమ్ ।
పూర్ణాయాం మృగమీనకర్కటధనుఃకుంభేషు చారోదయే
స్థాప్యం గృంజనముక్తమాహురితి వాసిష్ఠాత్రిగార్గ్యాదయః ॥

తా॥ రేవతి, అశ్విని, అనూరాధ, స్వాతి, శతభిషం, పునర్వసు పుష్యమి, ఉత్తర, హస్త, జ్యేష్ఠ, శ్రవణము, మూల, మృగశీర్షా, ఈ పదమూడు నక్షత్రములును, ఆది, గురు, సోమవారములును, పంచమీ, దశమీ, పూర్ణిమా తిథులును, మకర, మీన, వృశ్చిక, ధనుః, కుంభములు ఈ లగ్నములున్ను ఉల్లివిత్తనములు పాతిపెట్టుటకు మేలని వసిష్ఠాది మహామునులు చెప్పిరని తాత్పర్యము.

## ఏరువాకకు ఉక్తకాలము

శ్లో॥ శూర్పారేందుమఘాదితీ విధిహయశ్రీశత్రయత్ర్యుత్తర-
క్రవ్యాదాంత్యసమీరమిత్రగురుషు క్ష్మాజార్యతీక్ష్ణత్విషామ్
వారే స్యాద్ధలకర్మ గోంత్యయుగకన్యాచాపకీటే శుభం
తౌళీనక్రఘటాజకర్కిహరిషు ప్రాణఘ్నసస్యక్షయౌ ॥
చోరత్రాసపశుఘ్నదాహభుజగత్రాసా భవేయుః క్రమాత్ ॥

తా॥ విశాఖా, హస్త, మృగశిర, మఖ, పునర్వసు, రోహిణి, అశ్విని, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, రేవతి, స్వాతి, అనూరాధ, పుష్యమి, ౧౮ నక్షత్రములయందును, కుజ, గురు, భానువారములయందును, వృషభము, మీనము, మిథునము, కన్య, ధనుస్సు, వృశ్చికము ఈ లగ్నములయందును కృషికర్మనారంభించుటచేత నానావిధములయిన శుభఫలములు గలుగును. తులాలగ్నమునందు కృషికర్మ నారంభించిన ప్రాణహాని గలుగును. మకరమున నారంభించిన సస్యనాశనమును - కుంభమునం దయ్యేనేని చోరభయమును, మేష మునందారంభించిన పశుహానియు, కర్కాటకమునందారంభించినయెడల పశువులకు హానియు సింహమందారంభించిన యెడల సర్పములవలన మనుష్యులకు భయమును గలుగునని తాత్పర్యము.

## శెనగవిత్తులు చల్లుటకును, విత్తనములు కట్టకట్టుటకును ఉక్తకాలము

శ్లో॥ మూలాత్ర్యుత్తర వైష్ణవేంద్వదితివస్వంత్యాజ మైత్రానిలే-
ష్వేవం కర్కిధనుర్ఘట స్థిరగృహేష్వాహుశ్చ వారే శుభే ।
బీజావాపనమన్వహం చణక గోధూమాఢకానాం శుభం
మూలాత్ర్యుత్తర మైత్ర శూర్పమఘ విష్ణ్వంత్యేజ్యభే బంధనమ్ ॥

తా॥ మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, మృగశిర, పునర్వసు, ధనిష్ఠ, రేవతి, రోహిణి, అనూరాధ, స్వాతి, ఈ ౧౨ నక్షత్రములయందును కర్కాటము, ధనుస్సు, తుల, వృషభము, సింహము, వృశ్చికము, కుంభము ఈ లగ్నములయందును, బుధ, గురు, శుక్ర వారములయందును శెనగ, గోధుమ కందులు ఈ విత్తనములు చేలయందు చల్లుటచేత అధికముగా ఫలించునని యెరుంగవలయును. మరియు మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనూరాధ, విశాఖ, మఖ, శ్రవణము, రేవతి, పుష్యమీ — ఈ పది నక్షత్రములయందు నానాజాతి విత్తనములుల మూటలు కట్టిపెట్టుటచే నానావిధములగు శుభములు గలుగునని తాత్పర్యము.

## వధూవరుల పొంతనములు

| నామాద్యక్షరములు | నక్షత్రం | పాదము | రాసులు | రాశ్యధిపతులు | ౧ గణము | ౨ జంతువులు | ౩ నాడి | ౪ రజ్జు |
|---|---|---|---|---|---|---|---|---|
| చూ చే చో ల | అశ్విని | ౪ | మేషం | కుజ | దేవ | గుఱ్ఱం | ఆది | పాద |
| లీ లూ లే లో | భరణి | ౪ | మేషం | కుజ | మను | ఏనుగ | మధ్య | కటి |
| ఆ ఈ ఊ ఏ | కృత్తిక | ౧_౩ | మే_వృష | కు_శు | రాక్ష | మేక | అంత్య | ఉదర |
| ఓ వా వీ వో | రోహిణి | ౪ | వృషభం | శుక్ర | మను | పాము | అంత్య | కంఠ |
| వే వో కా కి | మృగ | ౨_౨ | వృష_మిథు | శు_బు | దేవ | పాము | మధ్య | శిరస్సు |
| కూ ఘ ఙ ఛ | ఆర్ద్ర | ౪ | మిథునం | బుధ | మను | కుక్క | ఆది | కంఠ |
| కే కో హా హీ | పునర్వ | ౩_౧ | మిథు_కట | బు_చం | దేవ | పిల్లి | ఆది | ఉదర |
| హూ హే హో డా | పుష్య | ౪ | కటకం | చంద్ర | దేవ | మేక | మధ్య | కటి |
| డీ డూ డే డో | ఆశ్లే | ౪ | కటకం | చంద్ర | రాక్ష | పిల్లి | అంత్య | పాద |
| మా మీ మూ మే | మఖ | ౪ | సింహం | రవి | రాక్ష | ఎలుక | అంత్య | పాద |
| మో టా టీ టూ | పుబ్బ | ౪ | సింహం | రవి | మను | ఎలుక | మధ్య | కటి |
| టే టో పా పీ | ఉత్తర | ౧_౩ | సింహ_కన్య | రవి_బు | మను | గోవు | ఆది | ఉదర |
| పూ ష ణ ఠ | హస్త | ౪ | కన్య | బుధ | దేవ | ఎనుము | ఆది | కంఠ |
| పే పో రా రి | చిత్త | ౨_౨ | కన్య_తుల | బు_శు | రాక్ష | పులి | మధ్య | శిరస్సు |
| రూ రే రో త | స్వాతి | ౪ | తుల | శుక్ర | దేవ | దున్న | అంత్య | కంఠ |
| తీ తూ తే తో | విశాఖ | ౩_౧ | తుల_వృశ్చి | శు_కు | రాక్ష | పులి | అంత్య | ఉదర |
| నా నీ నూ నే | అనూ | ౪ | వృశ్చికం | కుజ | దేవ | జింక | మధ్య | కటి |
| నో యా యి యూ | జ్యేష్ఠ | ౪ | వృశ్చికం | కుజ | రాక్ష | జింక | ఆది | పాద |
| యే యో బా బీ | మూల | ౪ | ధనుస్సు | గురు | రాక్ష | కుక్క | ఆది | పాద |
| బూ ధా భా ఢా | పూ_షా | ౪ | ధనుస్సు | గురు | మను | కోతి | మధ్య | కటి |
| బే బో జా జీ | ఉ_షా | ౧_౩ | ధను_మక | గు_శని | మను | ముంగిస | అంత్య | ఉదర |
| జూ జే జో ఖా | అభి | | మకరం | శని | ౦ | ముంగిస | ౦ | ౦ |
| ఖీ ఖూ ఖే ఖో | శ్రవణ | ౪ | మకరం | శని | దేవ | కోతి | అంత్య | కంఠ |
| గా గీ గూ గే | ధనిష్ఠ | ౨_౨ | మకర_కుంభ | శని_శని | రాక్ష | సింహం | మధ్య | శిరస్సు |
| గో సా సీ సూ | శతభిష | ౪ | కుంభం | శని | రాక్ష | గుఱ్ఱం | ఆది | కంఠ |
| సే సో దా దీ | పూ_భా | ౩_౧ | కుంభ_మీనం | శ_గురు | మను | సింహం | ఆది | ఉదర |
| దు ఝ ఞ థా | ఉ_భా | ౪ | మీనం | గురు | మను | గోవు | మధ్య | కటి |
| దే దో చా చీ | రేవతి | ౪ | మీనం | గురు | దేవ | ఏనుగు | అంత్య | పాద |

కృష్ణ—మృగ ౩ హృష్ణ—స్వాతి ౧ శ్రీధరః—చిత్త ౪ క్షేత్రపాల—హస్త ౨ జ్ఞాన—ఆర్ద్రా ౩ భీమ—మూల ౩ భైరవ—పూ-షా ౩ బ్రహ్మ—చిత్త ౩-౪ పా, ప్రభాకర—చిత్త ౩-౪ పా, ప్రహ్లాద—చిత్త ౩-౪ పా, పుణి—ఉత్తర ౩ ద్రోణ—స్వాతి ౧ ద్రౌపది—స్వాతి ౩ (నామ నక్షత్రములు.)

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ. | సూర్యదశ | ౬ సం॥ | పుష్యమి, అనూరాధ. ఉత్తరాభాద్ర | శనిదశ | ౧౯ సం॥ |
| రోహిణి, హస్త, శ్రవణం. | చంద్రదశ | ౧౦ సం॥ | ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి | బుధదశ | ౧౭ సం॥ |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ | కుజదశ | ౭ సం॥ | అశ్విని, మఘ, మూల | కేతుదశ | ౭ సం॥ |
| ఆర్ద్రా. స్వాతి, శతభిషం | రాహుదశ | ౧౮ సం॥ | భరణి, పూర్వఫల్గుని, పూర్వాషాఢ | శుక్రదశ | ౨౦ సం॥ |
| పునర్వసు. విశాఖ. పూర్వభాద్ర | గురుదశ | ౧౬ సం॥ | | మొత్తం | ౧౨౦ సం॥ |

## దశవిధ పొంతనములు

**నాడిపొంతనము॥** చతుష్పాద నక్షత్రములయందుబుట్టిన స్త్రీ పురుషులకు అశ్విని మొదలు మూడు వేళ్లయందును త్రిపాన్నక్షత్రములయందు బుట్టిన స్త్రీ పురుషులకు కృత్తిక మొదలు నాలుగు వ్రేళ్లయందును ద్విపాన్నక్షత్రములయందు బుట్టిన స్త్రీ పురుషులకు మృగశిర మొదలు ఐదు వ్రేళ్లయందును లెక్కింపగా స్త్రీ పురుష నక్షత్రములు ఒక వ్రేలియందు గలశుభమనియు భేదంబుగా నున్న యెడల శుభకరంబనియు తెలియవలయును.

**రాశివర్గః ॥** స్త్రీ పురుష రాసు లొకటియైనను, స్త్రీరాశికి, పురుషరాశి ౭కి పైబడినను ఉత్తమము స్త్రీరాశికి, పురుషరాశి ౩_౪ అయితే మధ్యమము. ౨_౫_౬ రాసులైతే అధమము. ౮వ రాశియైతే పనికిరాదు : దీని ఫలం. వంశవృద్ధి.

**రజ్జువర్గః ॥** మృ చి ధని రో హస్త శ్ర ఆ స్వా శత ౧ కృత్తి ఉత్తర ఉషా పున విశా పూభా ౧
భర పుబ్బ పూషా పుష్య అనూ ఉభా ౧ అశ్వి మఖ మూ ఆశ్లే జ్యే రేవ ౧

శ్లో॥ ఏకరజ్జుర్మృత్యుకరీ భిన్నరజ్జుశ్శుభావహా॥

**గణవర్గః॥** పున పుష్య స్వా హస్త శ్రవ రేవ అనూ మృ అశ్వి దేవగణము
రో పుబ్బ పూషా పూభా భర ఆ ఉత్తర ఉషా ఉభా మనుష్యగణము।
కృ ఆశ్లే మఖ చి విశా జ్యే మూ ధని శత రాక్షసగణము॥

శ్లో॥ స్త్రీ రాక్షసగణాజ్జాతా హంతి మర్త్యగణం వరమ్।

**వశ్యవర్గః॥**

| | | | |
|---|---|---|---|
| మేషస్య సింహ వృశ్చికరాశీ వశ్యా। | | తులాయాః మకర రాశిః | వశ్యా |
| వృషభస్య కటక తులారాశీ | ,, | వృశ్చికస్య కటకకన్యారాశీ | ,, |
| మిథునస్య కన్యారాశిః | ,, | ధనుషః మీనరాశిః | ,, |
| కటకస్య వృశ్చిక ధనూరాశీ | ,, | మకరస్య కుంభరాశిః | ,, |
| సింహస్య మకరరాశిః | ,, | కుంభస్య మీనరాశిః | ,, |
| కన్యాయాః వృషభ మీనరాశీ | ,, | మీనస్య మకరరాశిః | ,, |

శ్లో॥ వశ్యయోగాచ్ఛుభం ప్రోక్తం స్త్రీ రాశేః పురుషస్య చ॥

**దినవర్గః ॥** శ్లో॥ కన్యాది నవతారాంతం గణయేన్నవ భాజితమ్। శిష్టం సమం యది శుభం విషమం చేదరిష్టదమ్॥
తా॥ కన్యాజన్మ, నామ, నక్షత్రము మొదలు వరజన్మ నామ నక్షత్రమువరకు యెంచి తొమ్మిదిచే భాగించగా సరిసంఖ్య శుభమున్ను విషమసంఖ్య అరిష్టమున్ను ఔను॥

**మాహేంద్రవర్గః ॥** వధూనక్షత్రము మొదలు వరనక్షత్రమువరకు లెక్కించగా ౧_౪_౭_౧౦_౧౩_౧౬_౧౯ ౨౨_౨౫ ఐతే మేలుకలదు.

**యోనివర్గః ॥** అశ్వ-శత గుఱ్ఱములు, భరణి-రేవతి యేనుగ, పుష్య-కృత్తిక మేక, రోహి-మృగ సర్పములు, ఆ-మూ కుక్క, పున-ఆశ్లే పిల్లి, మఖ-పుబ్బ ఎలుక, హస్త-స్వాతి ఎనుము, చి-విశా పులి, అనూ-జ్యే జింక, ఉఫ-ఉభా ఆవు, అభి - ఉ-షా ముంగిస, పూభా-ధని సింహము, పూషా-శ్రవ కోతి.

**వర్ణవర్గః ॥** కర్కీ-వృశ్చిక మీనములు బ్రాహ్మణులు. మేషసింహ ధనుస్సులు క్షత్రియులు. మిథునతులా కుంభములు వైశ్యులు. వృషభకన్యా మకరములు శూద్రులు

శ్లో॥ న దద్యాద్వర్ణహీనస్య వర్ణశ్రేష్ఠాం తు కన్యకామ్॥

**స్త్రీ దీర్ఘవర్గః ॥** వధూనక్షత్రమారభ్య నవభాదూర్ధ్వసంస్థితమ్। వరభం శుభదం ప్రోక్తమితి దైవవిదాం వరైః॥

